దాని ఫలము బాల్యము ననుభవించును. అన్యాయార్జితంబగు సొత్తును ప్రయోజనాకాంక్షియై యిచ్చినవాడు తత్ఫలము వార్ధకమున భక్తి నొసరించుకొనును. కీర్తినిగోరకగాక పవిత్రార్జితవిత్తమును దేశకాల పాత్రము లెఱింగి యీయవలయును. నిర్ధనుని కిట్టి దానఫలమెక్కడిది? ప్రాణము లున్నను లిట్టివి. పేదవానికిహము లేదు పరము లేదు. దరిద్రు డని మని నరులు హీనముగ జూచెదరు. దారిద్ర్యము మహాపాపము. పతితు డట్లు దరిద్రుడు శోచనీయుడు. శరీరకృశుడు కృశుడుగాడు. కృశాశ్వుడు (అశ్వాది పశుసంపద కృశించినవాడు) కృశధనుడు కృశభృత్యుడు కృశాతిథియునైన మానవుడే కృశుడు. నిర్ధనుడు కులీనుం డయ్యు పరాభవపాత్ర మగును. ధనికు డకులుండయ్యు కులీనుడు. జ్ఞానవృద్ధులు తపోవృద్ధులు, శ్రుతవృద్ధులు ధనవృద్ధుని ద్వారముకడ కింకరులు. త్రిభువనములందును మాకు ధన మహదైశ్వర్యమైనను నయ్యది యన్యులచే నర్థింపబడి యనంతఫలప్రదమగుచున్నది. అని విమర్శించి దేశదేశములందు నగరముల గ్రామముల నాశ్రమములను బర్యటించి విప్రుల స్థాపింపదగు స్థానము నరయుచుంటినని సురముని సురేశ్వరనందనునకు దెలిపెను.

## —: (అ 3) మహీసాగరసంగమతీర్థ ప్రశంస :—

ఇట్లు పుణ్యస్థానముల సంచరించి రేవాతీరమున భృగుమహర్షి యాశ్రమమున కేగితిని. దర్శన కీర్తనమ్ములచే నన్నది పవిత్రుల జేయగలది. దేహమున బింగళనాడి యున్నట్లే బ్రహ్మాండశరీరమున నీనది బింగళనాడీస్థానీయమైయున్నది. ఆ రేవానదియందు శుక్ల తీర్థమను నొక్కటి యున్నది. అందు స్నానముచేసిన బ్రహ్మహత్యా పాపము నశించును. రేవానది కుత్తరతీరమున పుష్పఫలోపేతమ్మగు లతాతరువనంబు కదళీషండమండితమ్ము గలదు. శివభక్తుండు సంసారముక్తుండై హరునిపాదముల లీనమైనట్లు మధుపములు సర్వమును విడిచి యవ్వనకుసుమ మధువాసనలం దవిలి వర్తించుచు ఝంఝుమ్మని మొరయుచుండును. కథామృతముల బ్రాహ్మణులు భవ

భీరువులం దనియించున ట్లచట కోకిలలు మధురతర పంచమ స్వరంబుల ముకుల నాకందితుల గావించును. హర్షవ్రతులగు జనుల స్కంపలి వృక్షములు పత్ర ఫల పుష్పమ్ములను నీడలను నింధనముల నొసంగి యలరించును. శివప్రియులగు శివభక్తులు శివశివ యనునట్లు పుత్రవత్సలములగు ఖగంబులందు పుత్రపుత్రయని కూయును. ఇట్లా భృగు నాశ్రమమండలము త్రివేదులగు కర్మకులచే నొప్పియుండెను రుద్రభక్తులచే భువనత్రయ మాపూరితమైనట్లు ఋగ్యజుస్సామ ఘోషమ్ముల దిగంతరమ్ములందు ప్రతిధ్వనించుచుండును.

అందు భృగుమహర్షి సన్నిధి కే నరిగితిని. భృగుపురోగము లగు మునులు నన్నర్చించిరి. భృగుమహర్షి దీనునిగను ముదితునిగను గూడ నన్ను పలకరించి యాగమనకారణ మడిగెను. బ్రాహ్మణుల కిచ్చుట కుచితము క్షేత్రతీర్థభూతమగు భూతలం బెందును గనిపింప దయ్యె నని ఖిన్నుండనైతి నని తెల్పితిని. నేనును మున్నిందులకే పర్యటించితిని. పృథ్వియే మహీయను పేర నదియై యొక్కటి సర్వతీర్థ మయి మహాపాప ప్రశమనియైన దానింగాంచితిని. అది సముద్రగామిని. మహీసాగర సంగమంబున స్తంభమను తీర్థమొకటి గలదు. అందు మునిగినవారికి యమదర్శనము లేదు. ఏ నందు స్నానమునకేగిన తఱి నొక యాశ్చర్యము జరిగె నది వినుము. అమ్మహీసాగర సంగమ తీరమున నగ్నివలె వెలుంగుచు నున్నతుడై యస్థిమాత్రావశేషుం డయ్యు తపోలక్ష్మి నలరారు నొక మునివృద్ధుం గంటిని. అమ్ముని రెండుచేతులు మీదికెత్తి రోదనముసేయుచుండ గని నేనును దుఃఖించితిని. ఇట్లు దుఃఖించుట సాధులక్షణము. అహింస సత్యము నస్తేయము ననుగుణములు మానవ దుర్లభములు. అతని దరిజేరి శోకహేతు వడిగితిని. నాకథ యెందుల కడిగెదవు? అభాగ్యుడనన మతిమతి యడిగితిని. ఇంతలో సుభద్రుండను ముని యచటి కేతెంచెను.

అతడును నావలెనే రోదనకారణ మడిగెను. అప్పు డాచమించి యమ్ముని, వినుండు నేను దేవశర్మయను మునినై వాఙ్మనఃకాయముల

నివసించుకొని గంగాసాగర సంగమమునం దుంటిని. అచ్చట నమా
వాస్యాదుల పితరులకు దర్పణము వదలుచుంటిని. శ్రాద్ధావసానమున
వారు నాకు ప్రత్యక్షమై యాశీస్సుల నిచ్చుచుండిరి. ఒకప్పుడు
పితరులు ప్రహృష్టులై యిప్పుడు మేము నీ దరికి వచ్చుచుంటిమి కాని నీ వొక
నాడైన మా కడకు రావేమి యనియడిగిరి. అద్దానను వారడుగోరియు
నే నప్పుడు గేనై తిరంటిని. వారి యనుగ్రహమునచే నాలోకమున
జేరితిని. అది పరమ పుణ్యాను. పితృలోకమునందున్నది. తేజోమండ
లముచే జూడరాని నాకీతరుల నందు చెప్పించి "ఎవ్వరీ మహా
మహులు ఇట్లు పరమసృష్టులై ప్రముదితులై పరమాప్యాయితులై వచ్చు
చున్నారు? మీరు నీవలె సంతత తృష్టులై ప్రముదితులై కానరారని
యడిగితిని. పితరులిట్లనిరి. నీకు భద్రమగుగాక! వీరు సుభద్రుని
పితరులు. మహీసాగర సంగమమున నతనిచే దర్పయంను దృప్తులైరి.
కావున నీయంతి సంతోషముతో నున్నారు. అనవిని సిగ్గుపడి దిగ్గ
వడి వారికి మ్రొక్కి యీ తావునకు వచ్చి మహీసాగరసంగమమున
నాశ్రమము నిర్మించుకొని ప్రతిదినయందును పితృతర్పణము సేసెద
నని నా భార్యయగు సుచిత్రను సహధర్మచారిణివై నాతో రమ్మంటిని.
అదియు "పాపీ! స్మశాన స్తంభ మట్టి నీకు నన్ను మా తండ్రి
యిచ్చెను. ఇచటి కందమూల ఫలాహారముల నీ కడుపు నిండదా!
నన్నా యుష్మనీటికి గొంపోదలచితివి. నీవే యడుకుబొమ్ము. నీపూర్వులు
సంతసింతురు. కాకివలె నెగిరిపొమ్ము- పోకుము. నాకేమిపని? అన
రెండుచెవులు మూసికొని విప్రులనేను శిష్యునికి దెలిపి యొంటరిగ
వచ్చి యీ తీర్థము సేవించితిని- మఱియు గృహిణి యర్ధశరీర
మందురు. అది లేనికతన నేను సగము మేనితో నిం దుంటిని. పత్నీ
హీనమైన శరీరము కర్మబాహ్యాము. స్త్రీశరీరమోహితుండు పశువు.
అను నీ రెండుపక్షములందును సారము గ్రహింపదగును. అర్ధశరీరి
యగు నను దస్పృశ్యుడు. ఉత్తానపాదుని కుమారు డుత్తము డావిధ
ముగా సురలచే నస్పృశ్యుండయ్యెను. అట్లైన నేని మ్మహీసాగర సంగ
మము విడిచి యచ్చటికే పోదునా! కాలాడకున్నది. అజ్ఞానసంకట

మునంజడి నా మనంబు ఖిన్నంబై యున్నది. ఇందుచే నిట్లేడ్చుచుం టిని. అన రోమహర్షణంబగు నమ్మునిభాషణంబు విని సాధువాడ మొకరించి యాపుణ్యసంగమమ్మునకు దండవత్ప్రణామము సేసి యమ్ముని ఋణమునకు ప్రతిక్రియ నాలోచించెను. నీటిబుడగవంటి మానుష జన్మమంది యది పరార్థ ముపయోగించువాడే పురుషుడనంబడును. తక్కినవారు పశుపక్షులు. అంత సుభద్రుం డిట్లనియె. దేవశర్మ! దుఃఖింపకుము. ఇప్పుడే నే నా మహీసాగర సంగమమ్మునకేగి నీకొఱకునై పితరుల నర్చించెద" అన విని 'తండ్రీ! నీవు దీర్ఘాయుష్మంతుడ వయ్యెదవుగాక! నాకై యిట్టి యశక్యమ్ము గావింప నెంచితివి. ఇది హర్షస్థానము. అయిన ననొక్క విషాదము బాధించుచున్నది. వృక్షముగా సాధువు లొరుల యుపకారముం గొనరు. దీనికిఁ బ్రతిక్రియగ గంగాసాగర సంగమమున నీపితృదేవతల కేను దర్పణంబు గావించి ఋణపరిష్కృతి నందెద. నాతోడుగఁ బల్కెద. నా తపస్సంచితమున నాల్గవభాగముకూడ నీకిచ్చెద. అంగీకరింపు మనియె. సుభద్రుండు నీకిష్టమైన సంతోషమేని యట్లే చేయుము. సాధువుల కేదిమార్గంబగు నట్లు యెఱింగినవాడు వర్తింపనగు. అంతట దేవశర్మ ప్రణామమొసంగి, పుణ్యముకొని స్వధామముసేరెను. నారద! ఇమ్మహాతీర్థ మహిమ మిట్టిది. స్మరణమ్మున నిప్పుడును నామేను గగుర్పొడిచెడినన విని యర్జున! హర్ష గద్గదవచనుండనై మృతుండమృతుండైనట్లు సాధువచనమ్మున భృగు నభినందించి మీరు మేము నాశుభతీర్థమ్మున కరిగి దర్శింతమన, నాతో వారు నేతేర నమ్మహీసాగరసంగమము వీక్షించి హర్షించితిమి. అవ్వల భృగునవిచి యన్నదీతటమ్మున యోగివలె గూరుచుండి యిక నా చేయదగిన కృత్యమేమని యాలోచించితిని.

నము చేసి తిరుగుమొగము పట్టితిమి" అనిన విని అర్జునా! మనసులో హర్షించి బ్రాహ్మణులకు వసతి కల్పింత మనుకొన్న నాకుపాయము లభించినది. విద్యామూల్యముగ నిది సాధ్యమగుటయు విశేషమే. ప్రతి గ్రహదోషము నాకింక గలుగదు. "ధర్మశ్రద్ధగలవానికి ధర్మము పాపశ్రద్ధగలవానికి పాపము పూర్తిగాకపోవని పురాణర్షి యగు వ్యాసుదేవుండు పలికియున్నాడు. ఇమ్మాట ముమ్మాటికి నిజము. సూక్ష్మభావమైన మహార్థ మొకటి యెప్పుడో నా మనసున సంకురించినది. అందులకీ శ్లోకార్థమును నేను దెలిసికొనెదగాక! అదృశ్యాకారులై యున్నప్పుడో పితృదేవతలు నాకీశ్లోకమును వినిపించిరని జ్ఞప్తికివచ్చుచున్నది. ఇని మహా పుణ్యతీర్థమునకే మొక్క వృద్ధబ్రాహ్మణాకృతి గొని రాజుకడ కరిగితిని. కోట్లకొలది విప్రోత్తములు చేయలేని శ్లోకవ్యాఖ్యానము నచేతిమాత్ర మగునా? యని మహారాజు పలుకుచున్నను నే శ్లోకార్థము వినిపించితిని. కొంచెమో గొప్పయో దానము చేసిన నది యభ్యుదయ మొసంగును. రాజా! దానము ద్విహేతువు అనగా శ్రద్ధ శక్తి యనునవి దానమునకు రెండు కారణములు. ఆ రెండును దాతకు పుణ్యసమృద్ధిని యశోయలాభమును జేకూర్చును. శ్రద్ధనుగూర్చి ప్రాచీనశ్లోక మొకటి గలదు. దాని యర్థ మిది. "కాయక్లేశములుపడి బహుధనరాసులు వెచ్చించినచో ధర్మసిద్ధి యగును కాని యందు సూక్ష్మధర్మము శ్రద్ధయే. శ్రద్ధయే తపస్సు స్వర్గమును మోక్షమును. శ్రద్ధయే సకలజగమ్మును. అశ్రద్ధచే నున్న దంతయును జివరకు ప్రాణముగూడ యిచ్చినను ఫలము శూన్యము. శ్రద్ధతో నే కొంచెమిచ్చిన నది యనంతఫలదమగును. మహాత్ములు శ్రద్ధచే ధర్మమునుసాధించిరి కాని ధనరాసులచేతగాదు. అకించనులయ్యు (బహుదరిద్రులయ్యు) శ్రద్ధావంతులగుటచేతనే మునులు స్వర్గమును జూరలాడిరి. శ్రద్ధ సాత్త్వికి రాజసి తామసి యని మూడు విధములు. దేవతలం గూర్చి యజ్ఞములు సేయుట సాత్త్వికశ్రద్ధ, యక్షరక్షస్సుల నర్చించుట రాజసి, భూతప్రేత పిశాచములం గొలుచుట తామసము. శ్రద్ధాళువై యుత్తమపాత్రమున దానము సేయవలయును.

ఆ స్వల్పము నిచ్చినను పరమునకు ప్రీతుడగును. ఇక శక్తి విషయ ములో శాస్త్రీయ నిర్ణయ మిట్లున్నది. తన కుటుంబ మనుభవించు ధనమున్న యావన్మాత్రమునకంటె ఎక్కువగా దానముసేయుట మహాపాప దోషమువంటిది. శక్తిదానము పరిణామమున విషమగును. తనవారు దుఃఖజీవనము గడుపుచుండగా శక్తివంచనచే నితరులకు దానము సేయుటయు నట్టి దోషమే, అది ధర్మవ్యతిరిక్తము. తనకు సేవచేయువారికి బెట్టక తాను జచ్చినతరువాత నూర్ధ్వలోక క్రియలకై విరివిగా దానముసేయుటకు దాచిపెట్టుటయు శుభోదర్కము గాదు. నిషిద్ధదానము ౧ సామాన్య ధనము (కుటుంబమునకొక్క ఉమ్మడి సొత్తు) ౨ యాచించి తెచ్చికొన్న సొమ్ము. ౩ ఇతరులు దాచ నిచ్చినది ౪ తాకట్టు పెట్టినది ౫ స్త్రీధనము ౬ దర్శనము (ప్రతి మానులు విగ్రహములు నన్నమాట) ౭ అన్వాహితము (అగ్నివి) ౮ నిక్షేపము (పాతిన) ౯ వంశముండగా సర్వస్వమును (ఉన్న దంతయును) ఇచ్చుట యను నీ తొమ్మిది విధములైన సొత్తు నాపద్ధర్మముగానైన దానమీయగూడదు. ఇచ్చిన మూర్ఖుడు ప్రాయ శ్చిత్తార్హుడు. "షడధిష్ఠానము" అనగా ౧ ధర్మము ౨ అర్థము ౩ కామము ౪ వ్రీడ ౫ హర్షము ౬ భయము అనునవి. అందు ధర్మ దానమనగా ప్రతిఫలాపేక్షలేక కేవల ధర్మబుద్ధితో బ్రాహ్మణుల కిచ్చుట. ఏదేని ప్రయోజన మాశించి చేయునది యర్థదానము. ప్రయోజనాపేక్షతో స్త్రీల కనురాగముతో నిచ్చునది కామ దానము. సభలో సిగ్గుపడి యాచకుల కిచ్చుట వ్రీడాదానము. ప్రియ మైన యొక విషయమును గనియు వినియు మనస్సుప్పొంగి యిచ్చుట హర్షదానము. ఇతరుల భయమును దుఃఖమును ననర్థమును హింసను జూచి యనుపకారులయిన వారికి జాలిచే నిచ్చుట భయదానము. దానషడంగము లెవ్వియనగా; ౧ దాత ౨ ప్రతిగ్రహీత 3 శుద్ధి ౪ విధివిహితమైన దానవస్తువు ౫ దేశము ౬ కాలము అనునవి. ఉత్తమదాత ఆరోగ్యవంతుడు దానశీలి అవ్యసని శుచి అనింద్యజీవ నుడు వక్రవర్తనుడు అశ్రద్ధావంతుడు అశాంతుడు గర్వి భీరువు

అసత్పాత్రాదిని దాలుప్ర నైనవాడు తామసదాత. ఉత్తమ ప్రతి గ్రహీత ప్రియత్నుడు (ప్రతిగ్రహోద్దేశమ్మమాట) వృత్తిశూన్యుడు కేవలము సత్పాత్రియత్నము గలవాడు జన్మదోషరహితుడు నగు వాడు. శ్రద్ధయనగా యాచకుని జూడగానే సుముఖుడై ప్రీతిమాట్రట సత్కరించుట అసూయలేకుండుటయును. ఒరులపీడింపక క్లేశపడక స్వప్ర యత్నమున సంపాదించిన సొమ్ము కొంచెమైన నధికమైన నది 'దేయ' మనబడును. సన్మార్గార్జితముగా నుద్దేశించి యది యివ్వదగినదై యుండవలెను. శాస్త్రవిధి లేకుండ చేసినట్టి దానము నిష్ఫలము. దానార్హములగు దేశకాలములను శాస్త్రము చేతనే తెలియదగును. ద్విపాశమనగా ఇహలోక పరలోక సుఖ విషయము. సత్పాత్రులకిచ్చిన దానము పరలోకమునను అపాత్రులకిచ్చి నది యిహలోకమునను సుఖము నిచ్చును. చతుఃప్రకార మనగా ౧ ధ్రువము ౨ త్రికము 3 కామ్యము ౪ నైమిత్తికము నని. ఇది వేదోక్తమైన దానమగును. ధ్రువమనగా జలివెందలి, ఆరామతటా కాదులను ప్రతిష్ఠించుట. త్రికమనగా సంతానము జయము ఐశ్వ ర్యము స్త్రీలు మొదలగు ఫలమునాశించి చేయునది. ఒకానొక కోరి కతో జేయునది కామ్యము. కాలము క్రియ గుణము నను త్రివిధవిష యములను గణించి హోమాదివిరహితముగ జేయుదానము నైమిత్తి కము. త్రివిధమనగా దానము ఉత్తమము మధ్యమము కానీయసము అని మూడువిధములు. ఇల్లు దేవాలయము విద్య భూమి గోవు నూయి ప్రాణము బంగారము ననువాని నిచ్చుట యుత్తమదానము. అన్నము తోలు వస్త్రములు అశ్వాదివాహనములు అను నాల్గును నొసంగుట మధ్యమదానము. గొడుగు చెప్పులు చెంబు మొదలయినవి, పెరుగు తేనె పీట దీపస్తంభము రాళ్ళు మొదలయినవాని నిచ్చుట కానీయస దానము. "త్రినాశము" అనగా ఆసురము రాక్షసము పైశాచము అని మూడువిధములయిన దానము. ఇచ్చి యిచ్చితినేయని పరితాప పడుట ఆసురము. అశ్రద్ధగా నిచ్చినది రాక్షసము. యాచకుని దిట్టుచు నిచ్చుట లేక యిచ్చి తిట్టుట పైశాచికము. ఈ త్రివిధదానము

నాశనకరము. కాని యిది ప్రతినాశమునఁబడదు. యథాశక్తి నీ శ్లోక
మును వ్యాఖ్యానించితిని. ఇది బాగో యోగో చెప్పుమన ధర్మ
వర్మ "రాజా! నాజన్మము నేడు ధన్యమైనది. తపస్సు ఫలించినది.
నేనిప్పుడు కృతార్థుడనైతిని. బ్రహ్మచారి నా జన్మము సఫలమగునట్లు
చేసె. శ్రమించి ధాన్యము జేపట్టగా నది యప్రియవాదివైన వాని జన్మ
మెట్లు వ్యర్థమో బహుప్రయాసమున బావి త్రవ్వింపగా నది యుప్పు
నీరైన నెట్లు వ్యర్థమో ధర్మాచరణములేని జీవిత మెట్లు నిష్ప్ర
యోజనమో యట్లు నాజన్మము వ్యర్థమయ్యెనని యనుకొనుచుండగా
మీ వలన నది సఫలమైనది. ధన్యుడను. కృతజ్ఞుడను. మీకును విప్ర
ులకును వందనమాచరించెద. మున్ను విష్ణువు సనకసనందన సనత్కు
మారులంగని "దారిద్ర్యముచే గడ్డి గఱచుచుండియు దమ కర్మ
ఫలమంతయు నాయందే సమర్పణము చేసి నిత్యతృప్తులై యుండు
బ్రాహ్మణుని ముఖమున సమర్పితమైన పదార్థమును నేనారగించినంత
ప్రీతితో యజ్ఞములందు ఘృతాప్లుతంబగు హవిర్భాగమును గూడ
యారగింపను. అని యథార్థము పలికెను. అనన్యస్థుండనై యిట్లు
క్లిష్టములగు సమస్యలనిచ్చి విప్రులం బరీక్షించి వారి కప్రియంబుసేసి
తిని. సర్వప్రభువులగు విప్రులు నన్ను క్షమింతురుగాక! ప్రసన్ను
లగుదురుగాక! ఇదె వేడుకొనియెద. నీ వెవ్వడవు? సామాన్యు
డవు గావు. నీకు నమస్కరించెద. అనుగ్రహము చూపవేడెద.
నీ స్వరూపఖ్యాపనము చేయుము. అన నేను ధర్మవర్మతో నృప
శ్రేష్ఠ! నేను నారదుడను. స్థానార్థినై వచ్చితిని. నీవన్న ద్రవ్య
మును భూమిని యిమ్ము. ఈ భూమియు ద్రవ్యమును దేవతలదేయైన
నేకాలమున నెవ్వడు రాజో యతని బ్రార్థించి కైకొనవలయునని
శాస్త్రనిశ్చయము గలదు. నృపతి యీశ్వరావతారము. భరించు
వాడు అభయప్రదాతయును గావున నిన్ను నేను ద్రవ్యశుద్ధి నాసించి
యాచించెద. నా ప్రార్థన మాదరించి నేను బ్రాహ్మణులకు దాన
మీయదగిన వసతియిమ్ము, అన ధర్మవర్మ మహారాజు నీవు నార
దుండవేయైన నా రాజ్యమంతయు నీదియే. నేను బ్రాహ్మణులకు
నీకును దాస్యమొనరించెద. ఇందు సంశయములేదన సురముని నీవు

మాభక్తుండవేని మా వచనమ్ము సేయవలయు. నీవింతము న్నిత్తు నన్న ప్రసన్యమిచ్చి సప్తగవ్యూతి మాత్రమ్మగు (గవ్యూతి = రెండు క్రోసులు) భూమినిగూడ యిమ్ము. ఇచ్చుటయేకా దాయిచ్చిన ధర్మము శాశ్వతముగా జెల్లునట్లు రక్షణయు నీవలన గావలయునన నాధర్మ ప్రభువు వల్లె యనియె. అర్జునా! ఆమీాది కార్యశేషమును నే నాలోచించితిని.

-; (౫ అధ్యా.) నారదకృత బ్రాహ్మణపరీక్ష :-

నారదుండు పార్థునితో నెండియు నిట్లనియె. అవ్వల నేను ధర్మవర్మంగని నీ విచ్చినధనము నీ యొద్దనే యుండనిమ్ము! అవసర మైనప్పుడు తీసికొందునని రైవతకాద్రికేగి యందలి రమణీయత కానందించితిని. సాధువైన గృహస్థును జూచి భార్యాపుత్రులట్లును సద్గురువు నాశ్రయించి జ్ఞానసంపన్నులయిన శిష్యమండలియట్లును నా గిరిపై నలరు కిసలయ కుసుమఫలభరితమ్ములైన తరుషండము నాశ్ర యించి కోకిలలు తృప్తికొని కూయుచుండును. శ్రీ మహాదేవు నాశ్ర యించి భక్తుండు నిజమనోరథము వడసిన ట్లా పుణ్యనగముపై తప మొనరించు మానవు లభీష్టము లందుదురు. ఆ కొండనెత్తమున గూరు చుండి యచట నల్లన వీచు చల్లని పరిమళవాయువులు మైసోక దని యుచు నాకు దుర్లభమనుకొనిన స్థానము లభించినది. అది బ్రాహ్మణ వినియోగ మగుట కిక యత్నించెద. పాత్రులగు విప్రుల నరయవలసి యున్నది. శ్రుతివాక్యములుగూడ యట్లనే వినవచ్చుచున్నవిగదా! చుక్కాని లేనిపడవ యవ్వలి యొడ్డుచేర్చజాల దట్లెంత యుత్తము డైనను ననాచారవంతుడగు విప్రు డన్యుల నుద్ధరింపజాలడు. వేదాధ్య యనసంపన్నుడు గాని బ్రాహ్మణుడు గడ్డినిప్పువలె జల్లారిపోవును. అట్టివానికి దానము సేయరాదు. వట్టిబూడిదలో హోమ మెవ్వరు జేయరుగదా! పాత్రుని విడిచి యపాత్రుని కిడుట, గోవును గాదని గార్దభమును బూజించుట, చవిటనేల విత్తులు చల్లుట, ఓటికుండలో

నాప్రవాలు పితుకుట, భస్మములో హవ్యము వేల్చుట. శాస్త్రవిహి
తులుగాని వాని కిచ్చిన దానము వ్యర్థమగుటయే కాదు సేవించిన
పుణ్యముకూడ నశించును. భూమి గోవులు భోగములు బంగారము శక
టము అశ్వము కన్య (విద్యాయవియుక్తము) వస్త్రము నెయ్యి తేజస్సు
సస్యాలు సంతానము నవనవ ప్రమాదకరమైన వస్తువులు కాన ప్రతి
గ్రహీతయగు విద్వాంసు డాపద్ధర్మములను దానము పుచ్చుకొను భయ
పడవలయును. ఏమాత్ర మిూరు చేసినను నరకము బడవలసిన యాప
దనె దుఃఖమందును. అందుచే మాసముల దపస్సు చేసికొనునట్టియు
స్వాధ్యాయము సాధించునట్టియు వేదాంతనిష్ఠుండయినట్టియు శాంత
డయినట్టి వానికిచ్చినది యుక్తమగును. దేశకాలము లెఱిగి శిష్టాచార
సహాయముతో బాలునికిచ్చినది సంపూర్ణమయిన ఫలప్రకారములు
గలది. కేవల విద్యగాని తపస్సుగాని యుండుటయే పాత్రతగాదు.
ఎప్పుడు నుత్తమశీలమునకు నీ రెండును గూడున ట్లయిన యుత్తమ
పాత్రము. ఆ మూడింటిలో విద్య ముఖ్యమైన యుత్తమలక్షణము.
విద్యచేతనే విప్రులు చక్షుష్మంతు లగుదురు. అది లేనివాడు గ్రుడ్డి
వాడే. దేశదేశములందుగల యట్టి చక్షుష్మంతులను విద్వాంసుడైన
దాత పరీక్షింపవలయును. అందుచే నా ప్రశ్నముల కుత్తరము
చెప్పువానికి నేను వసతి నిచ్చెదను. అని యటనుండి కదలి యాశ్రమ
ముల వెంట ప్రశ్నరూపములయిన యీ క్రింది శ్లోకముల బాడుచు
దిరుగుచుంటిని. ఫల్గునా! వినుము.

మాతృకాం కో విజానాతి కతిధా కీదృశాక్షరాం
పంచ పంచాద్భుతం గేహం కో విజానాతి వా ద్విజః
బహురూపాం స్త్రియంకర్తు మేకరూపాంచ వేత్తి కః
కోవా చిత్రకథాబంధం వేత్తి సంసార గోచరః
కోవార్ణవ మహాగ్రాహం వేత్తి విద్యాపరాయణః
కో వాష్టవిధ బ్రాహ్మణ్యం వేత్తి బ్రాహ్మణసత్తమః
యుగానాంచ చతుర్ణాంవా కోమూల దివసాన్వదేత్
చతుర్దశమనూనాం వా మూలవాసరం వేత్తి కః

కస్మింశ్చైవ దినే ప్రాప పూర్వాంవా భాస్కరో రథం
ఉద్వేజయతి భూతాని కృష్ణాహి రివ వేత్తి కః
కో వాఽస్మిన్ ఘోరసంసారే దక్షదక్షతమో భవేత్
పంథానా వపి జ్ఞాత్వా కశ్చిద్వేత్తి వక్తి చ బ్రాహ్మణః.
ఇతీమే ద్వాదశ ప్రశ్నాన్ యే విదుర్బ్రాహ్మణోత్తమాః
తే మే పూజ్యతమా స్తేషా మహ మారాధక శ్చిరమ్.
ఇ త్యహం గాయమానో వై భ్రమితః సకలాం మహీమ్."

ఆశ్రమవాసు లీ శ్లోకములు చాల క్లేశపెట్టునవిగా నున్నవి. వీనికొక నమస్కార మనిరి. ఇట్లఖిలభూమండలము పరిభ్రమించియు నుత్తమ బ్రాహ్మణుం గనలేనైతి. అంతట హిమాద్రిశిఖరమున నాసీనుండనై యింకేమిచేయుదునని చింతించుచుండ మఱియొక యూహ తట్టినది. కలాపగ్రామమున కిప్పటికిని నేను బోలేదు. అక్కడ తపోమూర్తులు శ్రుతాధ్యయనశాలురు సాధుశీలు రెనుబదినాలుగువేల దాక యుత్తమ బ్రాహ్మణులు గలరట. అని కదలి ఖేచరుండనై మంచు గడచి యవ్వలికేగి యపుణ్యభూమింగల యాగ్రామరత్నముం గాంచితిని. అది శతయోజనవిస్తీర్ణము. నానావృక్షసమాకుల మగు నందు పుణ్యాశ్రమము లనంతమునున్నవి. అచటి జీవులన్యోన్యమిత్రములు. ఆచోటు యజ్ఞశీలురగు మునుల కుపకారము. ధర్మశీలురు చేయు నుపకారము. ముగియుట యనునది లేదు. స్వాహాస్వధావషట్కార హంతకారము లట శమించుటయే లేదు. సూర్యచంద్ర వంశములయొక్కయు బ్రాహ్మణులయొక్కయు కృతయుగారంభకమైన బీజ మచ్చటనే యవశేషించి యున్నది. వేదములు మూర్తీభవించిన ట్లచటి విప్రులు వేదశాస్త్ర విషయములను వివిధవాదములు సేయుచుండిరి. అందెల్లరు మేధావులు. కొందఱాకసము నుండి మాంసము విరజిమ్మునట్లు ధనములం జిమ్ముచుండిరి. అచట నిల్చి నేను చేయెత్తి ఓ ద్విజులార! నా సమస్యలం బూరింపుడు. జ్ఞానశాలురగుదురేని యీ కాకినోల యొందులకు? నా ప్రశ్నము

లను వ్యాఖ్యానింపుము. అని కేకవేసితిని. అంతట నా [illegible] వారింకఁ బోవుచు 'నేను ముందు నేను ముందు' నని పలికిపిల్లలు నా ముందునకు దుమికిరి. వారికి నా ప్రశ్నములు వచ్చెంచును వినిపింప హేలగా 'బ్రాహ్మణ! పిల్లప్రశ్న లల్పములు. మాలో నెల్ల నతిహీనుఁడైనవాఁడు వీని కుత్తర మీయఁగలఁ' డనెను. నే నాశ్చర్యపడి ధన్యుఁడనైతినని సంతోషపడితిని. అందు మిక్కిలి కొద్దివాని నడిగితిని. అతఁడు సుతనుఁ డనువాఁడు. ఈతఁడు బాలుఁడే కాని యీడులేని జ్ఞానము గల బాలుఁడు 'విప్ర! నీ వడిగిన ప్రశ్నములు మిక్కిలి యల్పము లగుటచే నా నాల్క కంపించుచున్నది. అయినను నన్నిచటి వారిలో నల్పునిగఁ గొని యడిగితివి కాన చెప్పెదను వినుము. మాతృకాక్షరము లేఁబదిరెండు. అందు మొదటిది ఓంకారము. స్వరములు పదునాలుగు. స్పర్శలు ముప్పదిమూఁడు. ఆమీఁద అనుస్వారము విసర్గ జిహ్వామూలీయము ఉపధ్మానీయము ననునవి నాలుగు. మొత్త మేఁబదిరెండు. సంఖ్య చెప్పితిని. ఇఁక వీని యర్థమునకు ప్రాచీనేతిహాసము తెలిపెద వినుము.

మున్ను మిథిలయందు కౌథుముఁడను బ్రాహ్మణుం డొకఁ డుండెను. అతఁడు ముప్పదియొక వేయి సంవత్సరములు విద్యాభ్యాసంగమున నిమగ్నుండై యుండెను. క్షణముగూడ యూరకొనఁడయ్యె. అవ్వల గృహస్థుఁ డయ్యెను. కొంతకాలమునకు కుమారుఁడు కలిగెను. అతఁ డాబాల్యము జడుండట్లుండి మాతృకను నేర్చెను. అంతకుమించి యేదియు నతఁడు పఠింపఁడ. తండ్రి ఖిన్నుఁడై 'నాయన! చదువుకోరా! చదువుకోరా! నీకు మిఠాయి పెట్టెద! లేనిచో నా పిల్లలకు బెట్టెద నీ చెవులు మెలిపెట్టెద' అని నయమును భయమునుజూపు తండ్రిగని కుమారుఁడు 'తండ్రీ! మిఠాయికాసపడి యేమిచదువు? చదువు చదువన బరమార్థము చదువుగాని తక్కినచదువేల? అన దండ్రి మంచిది బాలక! నీకు బ్రహ్మాయువగుగాక! నీకు మంచిబుద్ధి పట్టుబడినది. ఇక జదువకున్న నేమి!' యనెను. కొడుకు విని, నాన్నా! తెలియవలసినదెల్ల తెలిసినది, ఆ మీఁద నెల్ల కంఠశోషయే, అది యెందులకు!

ఆహా, కంటి అక్కో! ఏమి నమ్ము పలుకుచుంటివి. ఏది నీ వెఱిగిన యర్థ మేమో పలుకుమనెను. ఏందుకని బాలుడు 'తండ్రి! ముప్పదిమొక్క వేయేండ్లు నానాశాస్త్రములు చదివి నీ మనసున భ్రాంతినే సంపాదించు కొంటివి. నానాశాస్త్రములం దిది యిది యిదే సత్యమని యందందు నీ నేరంపము గాలియై పోగినది. అది నేను వారించెద. గురూపదేశ మువదేశముగా జదివితివి. కాని యందలి యర్థ మిూ వెఱుగవైతివి. కేవల పాఠమాత్రులు ద్విపాత్పశువులు. కావున మోహమార్తాండ మగు నోంకా రార్థ మేను బలికెద వినుము.

అకారము బ్రహ్మ. ఉకారము విష్ణువు. మకారము రుద్రుడు. ఈ మూర్తిత్రయములు గుణము లనంబడును. శిరోభాగమున నున్న యర్థమాత్ర సదాశివుడు. ఇది ఓంకారమహిమ. ఇది సనాతని యగు శ్రుతి. ఈ మహిమ పదివేలయేండ్లకు కోటిగ్రంథములచేనైన దెలియరాదు. మెండియు సర్వసారసర్వస్వమైన యంశ మింకొక్కటి వినుము. అకారము మొదలు 'అః' అనుదాక గల పదునాల్గక్షరములు పదునల్గురు మనువులు. స్వాయంభువ స్వారోచి ఔత్తమ రైవత తామస చాక్షుష వైవస్వత సావర్ణి బ్రహ్మసావర్ణి రుద్రసావర్ణి దక్షసావర్ణి ధర్మసావర్ణి రౌచ్య భౌత్యములని యివి పదునాల్గు మన్వంతరములు. వీనివర్ణములు క్రమముగా శ్వేత పాండుర రక్త తామ్ర పీత కాపిల కృష్ణ శ్యామ ధూమ్ర సుపిశంగ పిశంగ త్రివర్ణ శబల కర్కంధురములను పదునాల్గు. ప్రకృతము వైవస్వతమన్వంతరము. ఇది ఔకారము. కృష్ణవర్ణము. కకారాది హకారాంతములగు ముప్పదిమూడును దేవతలు. కకారము మొదలు టకారముదనుక గల పండ్రెండు నాదిత్యులు. ధాత మిత్రుడు అర్యముడు శక్రుడు వరుణుడు అంశువు భృగుడు వివస్వంతుడు పూష సవిత త్వష్ట విష్ణువు నను నివి వారిపేర్లు. అందరికి కడగొట్టువాడగు నవిష్ణు వందఱిలో గుణాధికుడు. డకారము మొదలు బకారముదనుక గల యక్షరములు పదునొకండు నేకాదశరుద్రులు. కపాలి పింగళుడు భీముడు విరూపాక్షుడు విలోహితుడు అజకుడు శాసనుడు శాస్త శంభుడు చండుడు భవుడు నని వారి నామములు. భకా

రూపమైన పంచభూతతత్త్వములనుగలిసి మొత్తమిరువదియైదు తత్త్వములు. ఈ పంచవింశతితత్త్వ నిష్పన్నమైన దేహమే గేహము. ఇది స్వరూపముగ నెవ్వడెఱుంగునో యాతడు శివలాభమందును. బహురూపయను స్త్రీ యనగా బుద్ధి. అది నానావిషయసంపర్కముచే నానారూప యగును. ధర్మ మొక్కటి దానితో గూడుటచే బహురూపయయ్యునది యేకరూప యగును. ఈ తత్త్వార్థము నెఱింగినవాడు సంసిద్ధిబొందును. మునులు చెప్పినది దైవతములనుగూర్చిన భావనజేసియును కామవిషయమైనదియు నగు వచనము "చిత్రకథాబంధ" మనబడును. లోభమనునది యొక మొసలి. లోభమువలన పాపము క్రోధము కామము మోహము మాయ మానము స్తబ్ధత పరధనవాంఛ అవిద్య అప్రజ్ఞ యనునవి కల్గును. పరదార ధనాపహరణము సర్వపాపకార్యసాహసము పాపకార్యాచరణము లోభనిమిత్తములు. అట్టి లోభమును మోహమును జితాత్ము డగువాడు నిగ్రహింపవలయును. దంభము ద్రోహము నింద పిసినిగొట్టుతనము మత్సరము నను నీ దుర్గుణము లన్నియు నస్వాధీనచిత్తులగు దుష్టుల కుండును. బహుశ్రుతు లయిన పండితు లగాధములైన మహాశాస్త్రములను ధారణ చేయుదురు. సర్వసంశయములను ఛేదింపగలరు గాని యాశాగ్రస్తులయి యధోగతి నందుదురు. లోభక్రోధవశులయి శిష్టాచార దూరులయి మనసు పదను మాటతీపియు నై తృణాచ్ఛన్నకూపము లట్లుండి కేవల హేతువాదబలిష్ఠులై బహుమార్గములు (మతములను) కల్పించుచు వివిధజాతులయెడల కడునిష్ఠురులై తుదకు సర్వమార్గములను నాశనము చేయుదురు. ఇట్టి క్షుద్రులు ధర్మావతంసకులయి ధర్మధ్వజము చేబూని జగమును మోసము చేయుదురు. "ధర్మావతంసకు లనగా ధర్మమే జయము" అను నిట్టి పవిత్రవాక్యములను నెత్తిన గట్టుకొని ప్రజల మోసగించువారు. అట్లే జెండాలమీదవ్రాసి యవి పట్టుకొనువారు. (ఇట్టివారిని నేడును మనము చూచుచున్నాము) నిత్యము దురాశాపాతకులగు నిట్టివారు మహాపాతకులని యెఱుంగవలయును. జనకుడు యువనాశ్వుడు వృషాదర్భి ప్రసేనజిత్తు మొదలగు మహానుభావులు లోభమును

గెల్చి స్వర్గము చూరగొనెను. అట్టి మహారాజు లింక నెందరో కలరు. కావున నాకను జయించినవారు సంసారసాగరమును దాటుదురు. కానివారు గ్రాహగ్రస్తు లయ్యెదరు. ఇక బ్రాహ్మణాష్టకము వివరింతు వినుము. మాత్రుడు బ్రాహ్మణుడు శ్రోత్రియుడు అనూచానుడు భ్రూణుడు ఋషికల్పుడు ఋషి మునియు ననువారు తొలుత శ్రుతియం దుద్దిష్టులైరి. విద్యచేబట్టి వృత్తిచేబట్టియు నిందరిలో నుత్తరోత్తరు లుత్తములు. బ్రాహ్మణకులజుడు అనుపేతుడై క్రియాహీనుడైన జాతిమాత్రుడు మాత్రు డనబడును. ఏకోద్దేశము నతిక్రమించి (గ్రామమును విడిచి) వేదవిహితకర్మానుష్ఠాతయై ఋజుశాలి నిత్యతృప్తుడు సత్యవచనుడు దయాళువు నగువాడు బ్రాహ్మణుడు. షడంగములతో నేకశాఖాధ్యయనము చేసి షట్కర్మనిరతుండై ధర్మవేత్తయగు నాతడు శ్రోత్రియుడు. వేదవేదాంగ తత్త్వజ్ఞుడై శుద్ధమనస్కుడై పాపవర్జితుడైన శ్రోత్రియశ్రేష్ఠుడు పండితుడు నగువాడనూచానుడు. ఈ యనూచానగుణములతో బాటు యజ్ఞములందు స్వాధ్యాయమునందు నిమగ్నుడైన యతడు భ్రూణు డన నగును. అతడు యజ్ఞశిష్టమును భుజించుచు జితేంద్రియుడై కూడ యుండును. వైదికము లౌకికము సర్వజ్ఞానమును బడసియాశ్రమధర్మస్థుడై వశేంద్రియుండైన యాయన ఋషికల్పుడు. ఊర్ధ్వరేతస్కుడై నియతాహారుడై నిస్సంశయుడై శాపానుగ్రహసమర్థుడై సత్యసంధుడై యెల్లరకు గేసరుడైనవాడు ఋషి. నివృత్తిపరుడై సర్వతత్త్వజ్ఞుడై కామక్రోధాదివర్జితుడై ధ్యానయోగనిష్ఠుడై నిష్క్రియుడై దాంతుడై సమలోష్టాశ్మకాంచనుండైన యతడు ముని. ఇట్లు వంశముచేతను విద్యచేతను, శీలముచేతను బెద్దలైన విప్రవరులు త్రిశుక్లు లనబడి యజ్ఞములందు బూజనీయులయి యుందురు. ఇక యుగాదులవిషయము వినుము. కార్తిక శుక్లనవమి కృతయుగాది. వైశాఖశుద్ధ తృతీయ త్రేతాయుగాది. మాఘమున అమావాస్య ద్వాపరాది. భాద్రపద కృష్ణత్రయోదశి కల్యాది. ఈ తిథులందు దత్తమయినది యక్షయమగును. ప్రతియుగమునను వర్షశతంబిచ్చిన దానముతో ప్రతిసంవత్సరము యుగాదిదినమున నిచ్చినదానము సరి

పోవును. మన్వాదులువిషయ మిక దెల్పెద. ఆశ్వయుజ శుక్లనవమి కార్తికశు.ద్వాదశి చైత్రశుద్ధతృతీయ భాద్రపదశు.తృతీయ ఫాల్గునామావాస్య పుష్యశుద్ధైకాదశి ఆషాఢశుక్లదశమి మాఘశుక్ల సప్తమి శ్రావణకృష్ణాష్టమి ఆషాఢపూర్ణిమ కార్తికశుక్లపూర్ణిమ ఫాల్గుణశుక్ల పూర్ణిమ చైత్రశుద్ధ పూర్ణిమ జ్యేష్ఠశుద్ధ పూర్ణిమయు మన్వంతరాదులు అక్షయఫలదములు. మాఘశుద్ధ సప్తమి (రథసప్తమి) యందు సూర్యుడు మున్ను మొదట రథమును బడసెను. ఆనాడిచ్చినది హోమముచేసినది యక్షయమగును. సర్వదారిద్ర్యశమనమగు నీ తిథి సూర్యప్రీతికరము. నిత్యోద్వేజనము గల్గించు వాడు యాచకుడు. అట్టివాడు స్వర్గార్హుడు కాడు. దొంగ యెట్లు భూతములకు భయోద్వేగము కల్పించునో యాచకుడు నట్లేకాన నట్టిపాపి నరకమందును. "ఏ కర్మచే నాకీ యిహమునం దుపపత్తి జన్మము గల్గినది? దేనిచే నే నిక్కడనుండి యేలోకమున కేగెదను" అని విమర్శించి ప్రతిక్రియచేసికొనువాడు దక్షదక్షుడు. సంవత్సరములో మొదటి యెనిమిదిమాసములందును పూర్వాహ్ణమునందును బాల్యవయస్సునందును పురుషుడు కర్మమొనరించిన నద్దాన నతడు చివరి దశ సుఖమందును. అర్చిర్మార్గము ధూమమార్గము నని మార్గములు రెండు. అర్చిర్మార్గమున జనినవాడు మోక్షమందును. ధూమమార్గమున జనినవాడు తిరిగి వచ్చును. యజ్ఞములచే ధూమమార్గము నిష్కామకర్మముచే నర్చిరాదిమార్గమును బడయును. ఈ రెండును గానిది పాషండమార్గము. దేవతలను భావింపక మనుప్రోక్తములగు ధర్మముల ననుసరింపకుండు నీపాషండుడే మీద చెప్పిన రెండుగతులను గూడ పొందడు. ఇది నీవడిగిన ప్రశ్నములకు దత్వార్థము. బ్రాహ్మణోత్తమ! యథాశక్తిం దీని వచించితిని. ఇది మంచియో చెడ్డయో తెలుపుము. నన్ను నీవు నెఱింగింపుము. అని సుతనుండను విప్రకుమారుడు పల్కినది వివరించి కుమారుండు పాండుకుమారున కెఱింగించెను...

## —: (అధ్యా. ౬.) మహీసాగరసంగమ తీర్థ ప్రశంస :—

అర్జునా! సుతేనుండు నా ప్రశ్నములకిచ్చిన యీ యుత్త
రోక్త సమాధానములకు నేను సంతసించి నేను సాహసము మాని
ఏవదొ నటించి యీ సృష్టిలో మీవంటి బ్రాహ్మణ ప్రభువులు ప్రతిపా
లించుచున్నారో యకృతమున మాత్రం సీయగు బ్రహ్మ సమ్మతము.
హరి యీ సత్యమును పలికినాడు. కట్టి నాకు మార్గము తెలిపిన
మహానుభావులగు సిద్ధ్విజసాన్నిధ్యములకు నావలనగాని నాకంటె
యుపేక్షగు సర్వభూతాధిపతియగు ననంతునివల్లగాని మరెవ్వరివలనగాని
యపేక్ష యేమున్నది? కష్టంబు నేనన్నివిధములు ధన్యుడను. జన్మమొత్తి
సంపదలకు ఫలమిప్పుడు నాకు ప్రాప్తించినది. పాపోపశమన మొకింతయు
లేని మహామహులగు మీదర్శనము నాకు లభించినది. అనినవిని శాతా
తపప్రముఖులగు నా పితృప్రముఖు లర్ఘ్యపాద్యాములచే నన్ను బూజించి
దేవర్షి! మీ సందర్శనముచే మేము ధన్యులమయితిమి. ఎక్కడనుండి వచ్చి
తిరి. ఇప్పుడెచ్చటి కేగవలయును. ఇచ్చటికి వచ్చుటకు గారణ మాన
తిండనిరి. నేను బ్రహ్మవాక్యానుసారము మహీసాగరసంగమ మను
పుణ్యతీర్థమున విప్రులకు నివాసస్థాన మొసంగదలచి యుత్తములను
పరీక్షసేయుచు వచ్చితిని: మిమ్మిప్పుడు పరీక్షించితిని. మీ కగ్రహా
రాది కల్పన మొనరించి మిమ్ముల నందు స్థాపించెద ననుమతింప
వలయును. నన శాతాతపు ప్రల్లమునులవంక గనుగొని 'నారద!
దేవతలకైన భారతభూమియందు జన్మము దుర్లభము. అందును
మహీసాగరసంగము సర్వఫలప్రదము, మిక్కిలిదుర్లభము. కాని
యచట నొకదోషమున్నది. దొంగలు సాహసప్రియులు. క్రూరులు లట
చాలమంది కలరు.

"స్పర్శేషు షోడశం చైకవింశం గృహ్ణాంతి నో ధనమ్"

స్పర్శములందు బదునారవదియు నిరువదియొకటియునగు మా
ధనమును వారు హరింతురు. (కకారము మొదలు మకారమునకు
గల వర్ణములు స్పర్శము లనంబడు. అందు బదునారవది యనగా 'త'
కారము. ఇరువది యొకటవదియనగా 'ప' కారము. కలిసి 'తప'

తపస్సనే ధనమని యర్థము) అట్టి తపోధనము పోయినచో మాజన్మ
మెట్టిదగునో చూడుడు. ఆకలితో నుండుటయిన మేలుకాని మే మా
దొంగలచేతిలో బడనొల్లము.” అని పలుక నర్జునుడు మహర్షి ! చిత్ర
మైనకథ చెప్పుచుంటివి. ఆ దొంగలెవరు? వారు హరించు ధన
మేమి? ఆ విప్రులు దేనికి భయపడుదురు? వివరింపుమన నేను
కామక్రోధాదులే దొంగలు. తపస్సే ధనము. దాని నపహరించుటకు
జడిసియే విప్రులు నాతో నిట్లనుటయును నేను వారింగని విప్రు
లారా! జాగరూకులయి యున్నవారిని దొంగ లేమిచేయగలరు?
పిరికిపంద పోటరి యశుచియు నగువా డేమి సాధించును? వానిని
భూమియే మ్రింగివేయునన శాతాతపుం డయ్యా దొంగలు చాలక్రూ
రులు. మాధనముహరించి యెక్కడికో పారిపోయెదరు మేలుకొనియుం
డుట మాశక్యమగుట లేదు. దానముపట్టుదమన్న నది మిక్కిలిఘోరము.
ఆజీవవంతు ఫలము మాత్రమే దాన లభించును. (దానముపట్టి చేసిన
ధర్మములో నైదుభాగములు దాతకు బోవుననియు కర్తకొకభాగమే
మిగులుననియు భావము) అని యిట్లు చెప్పుచుండగా హారీతమునిస్వర్గ
మోక్షము లరచేతిలో నందించునది మహీసాగరసంగమము. స్తంభ
తీర్థమున నొకక్షణమేని నివాసము లభించునేని యీకలాపగ్రామమున
నిక నెవ్వడుండును? కుమారనాథుడను సచ్చటిస్వామిని మనమ్మున
నిల్పుకొంటిమేని చోరభయము మనల నేమిచేయగలదు? సాహసము
లేక సంపదపట్టదు. కాన నే నచ్చటికివచ్చెద. ఇచ్చట నాతోనిఱువది
యాఱువేలమంది షట్కర్మనిర్మతులు లోభదంభాదివర్జితులు పరి
శుద్ధులునగు బ్రాహ్మణులున్నారు. వారితోగూడ నేను వచ్చెదను.
అనిన నే నావిప్రులను నా దండాగ్రమున నిలుపుకొని ఖేచరుండనై
యుమ్మంచుగడచి కేదారమునకు వచ్చితిని. ‘అర్జున! ఆకాశయాన
మునగాని బిలమునుండికాని స్కందు ననుగ్రహముచే నది సుగమ్యము.
వేరువిధమునగా నది దుర్గమము. కేదారమునుండి నూరుయోజనములు
మంచు కప్పబడియుండును. ఆమీద నూరుయోజనముల విశాల
మయినది కలాపగ్రామము. ఆమీద నూరుయోజనములలో వాలు
కార్ణవము (ఇసుకసముద్రము) అను భూమికలదు. అది శతయోజన

నిస్త్రీత్వము ఆమిగాని స్వర్గము గలదు. అక్కడికి బిలద్వారమునఁబోవు
కాహారపానీయములు విడిచి పన్నెండవ నాఁడు ప్రాప్తింపఁబడును.
అంతట వారకహితుఁడయ్యెని తోడ్కొని కుమారస్వామి స్వప్నమున
గనిపించి నెక్కడవచ్చితివి యనుమతి యిచ్చెను. ఆ స్వామికి ప్రత్య
క్షముగానున్న బిలము జొచ్చి యేడువందల యోజనములు పోవలయును.
అక్కడ సూర్యసమప్రభంబగు మాణిక్యలింగ మున్నది. దానిచెంతను
నిర్మలమగు స్వర్ణమృత్తిక గలదు. అది తీసికొని స్తంభతీర్థమునకు వచ్చి
కుమారదేవు నారాధించి యచటి మహాతీర్థోదకముతో నామృత్తికం
బడిసికొని కన్నుల కంజనముగా బెట్టుకొనవలెను. శరీరమునకు బూసి
కొనవలెను. అంతట సాధకునకు నా బిలము గోచరముగా గన్పిం
చును. ఆ పూసికొన్న మృత్తికాప్రభావముచే నడచుచున్న భయంకర
ములైన పెనుబాములు, పైబడి భక్షింపవు. బిలమునందుము
సూర్యసన్నిభములగు సిద్ధులు వచ్చుచుండు ప్రోపగా కైలాస గామములను
గనిపించును అచటివారి కాయువు పాల్గునేల సంవత్సరములు. ఫల
భోజనమాత్రమున వర్తించుచు సంతోషింతు. మణిపుష్పార్జన శ్రమ
మచ్చటలేదు. తపశ్శక్తిచే వారిని దండాగ్రమున ధరించి మహీ
సాగరసంగమున కే నేతెంచితిని. అంతటితీర్థమున మునిగి వారు ముక్త
లయిరి. నే నావిప్రోత్తములతో నందు స్నానము చేసితిని. దేవర్షి
తర్పణములు చేసికొని భాస్కరుని చూచుచు వారిని హృదయమున
నిలిపి జపించితిమి. దేవతోపాసనను నెరవేర్చుచు గంధర్వాది
వర్గములు భాస్కరాది నవగ్రహములు లోకపాలురు పితరాదిశ్ర
చిత్రంబగు నమ్మహోత్సవమును గాంచితిని. నేను బ్రాహ్మణుల
పాదప్రక్షాళన మొనరింప బూనినంత నామధ్వనియుక్తము తృతీయమగు
గాంధార స్వరసంమితమును శివభక్తిమనోహరము నగు నొక
వాక్యము వినబడినది. అచటి విప్రులు బ్రాహ్మణ! నీ వెవడవు?
ఎటనుండి వచ్చితివి? నీ కోరిక యేమి? నీ మనంబున కేది యిష్ట
మది తెలుపుమని యడిగిరి. అయ్యా! నేను కపిలుడను. నారమని
కెఱింగింపుము. వారిని బ్రార్థించుటకై యేతెంచితిని అనెను. అమ్మాట
విని ప్రాజ్ఞుండగు కపిలుడే యిటు వచ్చెనా ధన్యుండనైతి. నీకివ్వరాని

జేసియు లేదు. నిన్నుమించిన సత్పాత్ర మింకొకటిలేదు. అని నేనన నమ్మహర్షి బ్రహ్మపుత్రా! నా కెనిమిదివేలమంది కలాపగ్రామవాసు లగు శిష్యు లున్నారు. వారికి భూదానము సేయుద ననియె. మంచిది యట్లే యగుగాక. నీవును "కాపిలము" అను పేర నొక యుత్తమ స్థానము నేర్పరచికొనుము. శ్రాద్ధకాలమందుగాని మఱియే సమయమందుగాని యతిథి యెవ్వనియాశ్రమమునుండి విముఖుడై మరలి పోవునో వాని పుణ్యకృత్యములు వినష్టములు. అతిథిని పూజింపనివాని కిది సాటి పాతకము లేదు. ఎవ్వ డతిథిని పూజించునో వానిని దేవతలు పూజించెదరని యతడు కపిలునకి భోజనము పెట్టితిని. అప్పుల హారీ తుండను మహాముని నాహ్వానించితిని. ఆయన యెడమపాదము చాచి నిలువబడెను. తోడనే సిద్ధులు సన్యాసులు మొదలగు దేవతలు హా హా యని నిలువబడి నవ్విరి. భూమండలమెల్ల వెదకి బాగుబాగు మంచి బ్రాహ్మణుల సంపాదించితి వనిరి. అంత నా మనసున శోక వేగము మిక్కుటమయ్యెను. ప్రాచీనపండితులు పలికిన గాథ నొక దానిని స్మరించితిని. అన్నికార్యములందును 'హాహా' అను శబ్దము నింద్యము. అద్దాన నేది చేసిన జేసినవానిపై బండపడితీరును" అని. అప్పుడు విప్రులం జూచి "అయ్యా మీ రెల్ల మూర్ఖులయ్యెదరుగాక! ధన ధాన్య శూన్యులయ్యెదరుగాక!" అంటిని. అంతట హారీతుండు నవ్వి 'ముని! మమ్ముల శపించితి విది నీక హానికరము. నీకు ప్రతిశాప మెందుల కిది నీకే శాపము." అనెను. నేను వెండియు విమర్శించి "అంతవాడవు నీ వెడమకాలు చాచితివి." అంటిని. హారీతుండును "బుద్ధిశాలి! దానికి గారణ మిది. ఈ దానము పట్టినతరువాత నేను వట్టి బెండునయ్యెద. అయ్యో! ప్రతిగ్రహము దుఃఖరూపము. ప్రతి గ్రహముచే బ్రాహ్మణుల బ్రాహ్మ్యతేజ మారిపోవును. మహాదాన మును బట్టి బ్రాహ్మణుడు తన యమూల్యమైన శుభమును ధనమును దాత కిచ్చుచు, దాత తన యశుభమును ప్రతిగ్రహీత కిచ్చును. కావున దాత ప్రతిగ్రహీతయను పదము లొండొరులయెడ దారుమారగు చున్నవి. దానగ్రహీత చేయి క్రిందయిన ట్లల్పబుద్ధి భావించి నశిం చును. అని యిట్లు తలంచినకొలది నేను బెండయితిని. విప్రోత్తముడు

భయార్తుడు కామార్తుడు శోకార్తుడు హృతధనుడు అన్యమనస్కుడు
ననఁ గోపింపరు శూన్యులు. నీవు బుద్ధిమంతుడవుకాన వీరిపై గోపము
చూపరాదు. కాని చూపితివి. ఇట్లు హానియు వచ్చినది." అని హారి
తుని వాక్యములు విని పశ్చాత్తాపతప్తుండనై తిని. అవిచారకారినై తిని.
అవిమృశ్యకారియైన వానికిగాని హాని యేమున్నది? త్వరపడి
యేపనియు జేయరాదు. అది యాపదలకు గారణమగును. విమ
ర్శించి చేయువానిని సర్వసంపదలు వరించును. మున్ను జిరకారి
యను పేరుగన్నమాట సత్యము మున్ను గౌతమసుతుండు చిరకారి
యనువాఁ డేపనింగాని నిదానముగా నాలోచించి చేయుచుండెను.
ప్రజలాతనింగని వట్టిసోమరి మందకొడి యని పలుకుచుండిరి. ఒకప్పు
డాతనితల్లి యెడ వ్యభిచారశంక బొడగి యామెం జంపుమని వాని
తండ్రి యతని కాజ్ఞ యిచ్చెను. అప్పుడతఁడు "తండ్రియాజ్ఞ సేయు
టయా? లేక తల్లిం గాపాడుకొనుటయా? యను సంశయములోఁ
బడెను. పిత్రాజ్ఞాపరిపాలన ముత్తమధర్మము మాతృవధ ఘోరమైన
యధర్మము. తండ్రిని దిరస్కరించి యెవ్వడు ప్రతిష్ఠ నడయఁగలఁడు?
నాకని తల్లిం జంపి యేమిసుఖ ముందఁగలఁడు! ఇద్దరి యనుగ్రహము
నాకవసరమే. ఆచారశీలములుగల వంశము నుద్ధరించుటకు భర్తయే
భార్యయందు పుత్రరూపమున నుదయించునని శాస్త్రము తెల్పు
చున్నది. కావున నాతండ్రిచేతనే నాయందు పుత్రత్వము గల్పిత
మైనది. నాతల్లి పంచకర్మములందలి మంత్రము లీయంశమును
దృఢముచేయుచున్నవి. శరీరాదులనిచ్చు వారెందఱో కలరుగాని
యాత్మయను శ్రేష్ఠవస్తువు నిచ్చువాడు తండ్రియొక్కడే కావున
పిత్రాజ్ఞ యవశ్యకర్తవ్యము. పితృవాక్యపరిపాలకునికి సర్వపాతకములు
నశించును. తండ్రియే స్వర్గము ధర్మము పరమ తపస్సును. పితృప్రీతిచే
సర్వదేవతాప్రీతి యగును. జనకుఁడుచేసిన దీవనలు తప్పక ఫలించును.
సర్వపాపములకు బ్రతిక్రియ తండ్రిమెప్పు గాంచుటయే. పువ్వు తొడిమ
నుండి విడును. పండు ముచికనుండి వీడును. పుత్రుడు తండ్రివలని
శతాపక్లేశమున పితృప్రేమను త్యజించునుగాని తండ్రిమాత్రము పుత్ర
వాత్సల్యమును విడువడు, విడువలేదు. పితృగౌరవ మిట్లుంత యాలో

చించిన నది యనల్పమే. ఇక మాతృవిషయ మాలోచించెద. అగ్నికి 'అరణి' యనగా (అగ్నిని మథించునపుడు క్రిందనుంచిన జమ్మికఱ్ఱకు అరణియని పేరు) పంచభూతసంఘాతమయిన యీశరీరమునకు దల్లి కారణము. మాతృ దేవత దేహారణి. జీవుల కిది సర్వావస్థతృప్తింగూర్చు నానందస్థానము. తల్లిగలవాడు సనాథుడు. మాతృహీను డనాథుడు. తల్లిలేనివాని స్థావర ప్రకృతియేని యాదరింపదు. దరిద్రుడయ్యు నమ్మాయని తల్లికడకు జేరినవాడు సుఖించును. మనుమల ముని మనుమలు గల్గియు నెన్నో యేండ్లమొదలలో నున్నవాడు నూరేండ్లవాడైన రెండేండ్లప్పటి బాలుడే. సమర్థుడైనను కృశుడైన నకృశుడైనను గొడుకును దల్లి సంరక్షించును. అంతకంటె మఱిపోషించువాడు లేడు. మాతృవియోగమయిన యుత్తరక్షణములో బాలుడు వృద్ధుడే యగును. దుఃఖియు నగును. అప్పుడు వానికి జగత్తంతయు శూన్యము. తల్లి కీడైన నీడ లేదు. తల్లికి జాలిన దిక్కు లేదు. తల్లితో సమమగు రక్షణలేదు. తల్లి చలివెండలినంటిది. (పాలిచ్చి తనివి తీరాస్పులచే తల్లిని జలివెండలితో బోల్చుటయు క్రమము) గర్భమున ధరించునదియగుట ధాత్రి. జనింపజేసినదిగాన జనని. అంగముల పుష్టినొసగునదిగాన అంబ, వీరుం గన్నదిగాన వీరమాత. శిశువునకు శుశ్రూషసేయునది యగుట శ్వశ్రువు. ప్రసూతునింగూర్చిన యోగక్షేమములంగూర్చి నిరంతరము మననముసేయునదిగాన మాత. ఇట్లు మాతృనామము లన్నియు సార్థకములు. దేవతాసముదాయ మంతయు గలిసి పితృరూపమగును. దేవమానవ సముదాయమంతయు గలిసినను దల్లిని మించజాలదు. పతితుడైన గురువైనను పరిత్యాజ్యుడే కాని తల్లి యట్టిదన్నదు గాదు. గర్భధారణ పోషణములు చేయునది గాన దల్లి యందఱికంటె గొప్పది. అని యిట్లు కౌశికీతీరమునం బలి చక్రవర్తిపై మోహముచెంది శిశుపాత్రులయిన తల్లిం జంపు విషయములో నాతడెంత విమర్శించియు నొకనిర్ణయమునకు రాలేక పోయెను. ఇంతలో నాతనితండ్రి యాశ్రమప్రాంతమున కింద్రుడు బ్రాహ్మణవేషము దాల్చివచ్చి యొకగాథను గానముచేసెను. దాని యర్థమిది.

"స్త్రీలందరు నస్వతంత్రప్రాయులు. బుద్ధిమంతులు వారివలన ఫలమందవలయుంగాని వారియెడ నెట్టిదోషదృష్టియు జూపరాదు." అని మేధాతిథియను నవ్విప్రుడు శాస్త్రమును స్మరించి కంట నీరు పెట్టుచు, ఆర్యా! ఈ స్వాధ్యాయశౌండనై దుఃఖసాగరమున బడిపోయితిని. సాధ్వియగు కళత్రం జంపించితిని. కట్టి మహాపాతకిని నన్నెవ్వ రుద్ధరింపగలరు? నాకుమారుడు బుద్ధిశాలి చిరకారి. అతడు నిజముగా నిపుడు చిరకారి యగుచేని నన్నీదురితము నుండి రక్షింపగలడు. నాయనా! నీకు భద్రమగుగాక! నీ చిరకారిత్వముచే నన్ను పాతకమునుండి తప్పింపుము. చిరకాలసమార్జితమగు నాతపమ్మునకు రక్ష యగుము. పాప పంకమున దిగబడితిని, అని యాక్రందించుచు బోయి గౌతముడు తల్లిం జంప నుద్యుక్తుడై కత్తి నెత్తియున్న తనయుం జూచెను. చిరకారియు దండ్రిం గని ఖడ్గము పారవైచి తలవంచి తండ్రియనుగ్రహ మర్థించెను. మేధాతిథి కొడుకుంగని ప్రాణములతో నక్కున ప్రాణేశ్వరిం గనియు నానంద మందెను. ఆమె తనయెదుట గత్తిపట్టుకొని నిలిచినకుమారుడు తనను జంపుటకే వచ్చెనని యెఱుంగదు. ఆయుధముం బట్టిన నేరమునకు భయపడి యతడు తండ్రియుత్సుకులం బడె నని మూర్ఛ యనుకొనెను. అవ్వల దండ్రి కొడుకుం గౌగిలించి శిరసు మూర్కొని 'చిరంజీవ' అని దీవించి నాయన! మంగళమగుంగాక! నీచేసిన నాదోషచికిత్సవికాన నాకు దుఃఖములేకుండ బోయినది. అని యమ్ముని క్రిందిగాథలను గానము సేసెను.

చిరేణ మంత్రం సంఛేయా చ్చిరేణ చ కృతం త్యజేత్.
చిరేణ విహితం మిత్రం చిరం ధారణ మర్హతి
రాగె దర్పేచ మానేచ ద్రోహే పాపే చ కర్మణి
అప్రియే చైవ కర్తవ్యే చిరకారీ ప్రశస్యతే.
బంధూనాం సుహృదాంచైవ భృత్యానాం స్త్రీజనస్యచ.
అవ్యక్తే ష్వపరాధేషు చిరకారీ ప్రశస్యతే.
చిరం ధర్మా న్నిషేవేత కుర్యా చ్చాన్వేషణం చిరం.

చిర మన్వాస్య విదుష శ్చిరమిష్టా నుపాస్యచ
చిరం వినీయ చాత్మానం చిరం యాత్యనవజ్ఞతాం
బ్రువతశ్చ పరస్యాపి వాక్యం ధర్మోపసంహితం
చిరం పృచ్ఛేచ్ఛ శృణుయా చ్చిరం న పరిభూయతే.
ధర్మే శత్రౌ శస్త్రపా స్తే పాత్రేచ నికటస్థితే
భయేచ సాధుపూజాయాం చిరకారీ నశస్యతే.

ఈగాథల యర్థమిది. ఆలోచన చిరకాలము సేయవలయును. కృతమును చిరకాలమునకు వదలవలెను. చిరకాలమునకు గుదిర్చికొన్న మిత్రుని చిరకాలము గాపాడుకొనవలయును. రోగము వచ్చినప్పుడు దర్పమెదుటివారికు చూపినప్పుడు లేక తాను దర్పము చూపవలసినప్పుడు మానమునందు, ద్రోహము జరిగినప్పుడు పాపకృత్యములందు నప్రియము చేయవలసినప్పుడు చిరకారి యగువాడు మెచ్చదగి యుండును. బంధువులు మిత్రులు భృత్యులు స్త్రీలు ననువారి నేరములు స్పష్టపడనప్పుడు చిరకారియయి నిదానించువాడు ప్రశంసార్హుడగును. ధర్మసేవ చిరకాలము సేయనగును. ఏదైన వెదకవలసినప్పుడు చిరకాలము వెదకవలయును. చిరకాలము విద్వాంసుల సేవించి చిరకాల మిష్టుల నుపాసించి చిరకాలము మనస్సును స్వాధీనమొనరించుకొన్నవాడు పరాభవము నందడు. ధర్మములను బలుకు శత్రువునైనను జిరకాలము ప్రశ్నింపవలయును. వినవలయును. ధర్మము సేయుపట్ల శస్త్రమెత్తివచ్చిన శత్రువునెడ నెట్టయెదుటికివచ్చిన యుత్తమదానపాత్రునియెడల భయమునందు సాధుపూజయందు జిరకారియగుట మంచిదిగాదు. అని యిట్లుపలికి భార్యాపుత్రులతో నాశ్రమమున కేగి చిరకాల ముపాసనసేసి యమ్మౌని దివంగతుడయ్యెను. మేమింత తెలిసి తెలుపువారమైనను మోహము మోసములో బడిపోయితిమి. నాశాపము మీకు గలియుగమునం దగులదు. కాని యక్కలిలోగూడ కొందరుత్తమగుణ సంపన్నులుందురు. అని ధర్మవర్మ సమీపమునవుండ వేల్పులను సాక్షులంజేసి సంకల్పము చెప్పి యవ్విప్రునిపాదములు గడిగి బంగారము గోవులు నింట్లు వాకి

ఘలు ధనములు సంగనలు నాభరణములు వస్త్రములు మున్నుగ నిచ్చి బ్రాహ్మణుల సంతుష్టులం గావించితిని. ఇంద్రుని వంటివారు బృందారక బృందమ్మున జేయెత్తి మాకు సర్వాంగము నెంతవరకు గిరికన్య యలంకరించియుండునో యంతవరకు నాదిత్యు లెంతవరకుండెదరో యంతవరకు త్రిభువనమ్ము లుండునో యంతవరకు నీవు ప్రతిష్ఠితమైన యీ స్థానము వెలయుచుండుగాక! బ్రహ్మశాపము రుద్రశాపము విష్ణుశాపము ద్విజశాపము లీస్థానమునందు జాగ్రన్మహాప ప్రవర్తకులగువారికి దప్ప కలుగుగాక! అని నన్నియగు గాక యని యాశీర్వదించి యవ్విప్రోత్తముల్తో నాస్థానమును స్థాపించితి నందు గపిలుని గూడ ముని ప్రతిష్ఠించెను. ఇట్టి కిరంగుస్థానములు దేవపూజితములు. దేవతలందరు ప్రసన్నులై దేవసదనంబున కేగిరి.

-: (అధ్యా. ౭.) ఇంద్రద్యుమ్నకథ :-

అర్జునుం డిట్లనియె. మహీసాగరసంగమ మహిమ మత్యద్భుతమైనది మీవలన వింటిని. సంతోషాశ్చర్యములు కల్గినవి. మహీనది యెవ్వని యజ్ఞమున వహ్నితాపమున దపించి వాడిపోయినదో తెలుపుమన నారదుం డిట్లనియె. మహీనదీ జన్మవృత్తాంతము విన్నవారు పుణ్యభాజను లయ్యెదరు. మున్నింద్రద్యుమ్నుం డను రాజుండెను. అతడు దాత. ధర్మజ్ఞుడు. గౌరవమిచ్చి పుచ్చుకొనువాడు. ఔచిత్యము దెలిసినవాడు. వివేకమునకు నివాసము. గుణసముద్రుడు. అతని పూర్తి ధర్మముచే నంకితముగాని నగరముగాని గ్రామముగాని ధరాతలమం దేదియులేదు. అనేక కన్యాదానాది దానములు సేసినవాడు. దశమి నాటిరాత్రియే యేకాదశవ్రత మందఱును జేయవలయునని యేన్గుపై దుందుభి మ్రోగించుచు చాటింప బంపును. యజ్ఞకర్తయగు నాతడు పఱచిన దర్భలచే భూమండలమెల్ల రెండంగుళము లెత్తైనది. గంగ యందలి యిసుకయు వర్షధారలు నక్షత్రములనైన లెక్కింపవచ్చును. గాని యతని సుకృతముమాత్రము లెక్కింప నలవిగాదు. ఇట్టి పుణ్యా

విశేషములచే నాతఁడు విమానముచే సశరీరస్వర్గము నందెను. నూఱు కల్పము లనల్పభోగము లనుభవించిన తరువాత దన్ను సేవింపవచ్చిన యాస్వర్పతిం గని బ్రహ్మ నీవు వేగమ భూమికేగుము. నాలోకమున నొక క్షణమేని యుండఁదగవన నింద్రద్యుమ్నుండు నా కనంతసుకృత రాశియుండఁగా నన్ను బుడమికేలంపెద వన జతుర్ముఖుండు కేవల సుకృతమైనపుణ్యము స్వర్గ సాధకము గాదు. త్రిలోకవిస్తృత మగు విమల కీర్తి లేక స్వర్గము రాదు. అవనిపై నీ కీర్తికి భంగము కల్గినది. దానిని మరల నూతన మొనరింపుము. అన నా రాజు నా కీర్తి యవి చ్ఛిన్నమగుట కేనేమి చేయఁగలయునని యడిగెను. బ్రహ్మ, రాజా! కాలము బలవంతము. అదియే బ్రహ్మాండములను నన్నును నిలుపుచున్నది. నీవంటివారి లెక్కేమి? కావున నీ కీర్తిని నిత్యనూతన మొనరించుకొని రమ్మన నప్పటి కప్పుడే యాతఁడు తనను బుడమిపై గాంపిల్యనగరమున నున్నట్లు చూచి యచ్చటి జనులను దనను గూర్చి తన పట్టణము గూర్చి ప్రశ్నించెను. వారును నీయడిగిన దెఱుంగము. మఱియెవ్వనినేని దీర్ఘాయుష్మంతు నడిగి తెలిసికొనుమనిరి. అత డరిగి యిప్పుడు భూతలమున జిరాయువెవ్వ డన ప్రజలు- సప్తకల్పము లాయుర్భాగ్యముగల మార్కండేయు డను ముని కల డాతని నడుగుమనిరి. అట్లే చని రాజమ్మునికి మ్రొక్కి నీవు చిరాయువుగాన నడిగెద. నింద్రద్యుమ్ను నెఱుంగుదువా యన నమ్ముని యేడుకల్పములవల నాపేరుగల రాజెవ్వఁడు నిమ్మేదిని గలుగఁడు. నే నే మందును? మఱి యేమేని సంశయమున్న నడుగుమన నారాజు నిరాశ చెంది యగ్నిప్రవేశము జేయ నుద్యోగించిన మునిగని విను మిక్కడ నాకు మిత్రమ్మొక బకమ్ము (కొంగ) చిరకాలజీవి గలదు. నాడీ జంఘుడు అని వాని నందురు, మన మాతని నడిగి వత్తమనిన నయ్యి ద్దరు హిమాలయమున నాడీజంఘుడున్న తావున కరిగిరి. చిరమిత్ర ముగు మార్కండేయుం గని యాకొంగ యుప్పొంగి యాగమనకారణ మేమనెను. మార్కండేయుండు దానితో "నీ వింద్రద్యుమ్ను నెఱింగి యుందువు. నామిత్రుడితండు ప్రాణత్యాగము సేయుచున్నాడు. నీవెఱి గితివేని చెప్పుము. ఇతని ప్రాణరక్షణము సేయుము. అన నాడీజంఘుడు

యందు భార్యతో గూడి తీవ్రతపము సేయుచు శల్యావశేషంబుగ
గృశించియున్న గాలవుండను మునిం గంటిని. బ్రాహ్మణుని దేహమిది
నైహికఫలప్రియమ్ముగాదు. ఇది కృచ్ఛచాంద్రాయణాదుల కిహమునను
జని పరమున ననంతసుఖానుభవమునకును గురియగును. ఆ ముని
భార్య యనుపమసౌందర్యరాశి విశ్వసమ్మోహిని. గాలవవల్లభంగని
నేను మోహించి పుష్పాస్త్రశరపుంజమ్ముల కగ్గమైతిని. హరిణాక్షీ
కటాక్షవీక్షణ లక్ష్యభూతులు గానంతదాక వివేకులు వివేకులే. అప్ప
డీమెను హరింతునా శివ స్త్రీపరిండితను శపించును. అప్పడీ సుందరి
నాపాలి మృత్యుదేవతయగును. కావున శిష్యుండనయ్యెద. ఇమ్మునికి
నే శుశ్రూష నొనరించెద. అంతట మెరంగి యీ కాంతను హరింతునని
నిశ్చయించి విద్యార్థిరూపమూని భవిష్యద్జ్ఞానియగు మునికి మ్రొక్కి
పురాకృతమ్ముంబట్టి బుద్ధి మిత్రుడు కృషియు సంఘటించును. వివేక
విరాగములు వదలి మాయంగ జేరితి. శిష్యుండను. నీవు నన్ను జదివింప
వలయు. నా జీవితనౌకకు నీవ కర్ణధారుడవు (చుక్కాని త్రిప్పువాడు)
మహామునివి. అపారసంసారము పారముం జేర్చువాడవు. విప్ర
రూపము దాల్చిన విష్ణుడవు గాలవుడను పేర ప్రత్యక్షచేతనబ్రహ్మవు
నీకు నమస్కారము. అవిద్యయను నల్లత్రాచు గఱచి విషపీడనందిన
నన్ను మీ యుపదేశమహామంత్రంబులచే విషమాంత్రికుడవై
బ్రతికింపుము. విషయబీజావాపమున మహామోహమను మహావృక్షము
పెరిగినది. నీవచనాఖ్యతీక్ష్ణధారంబగు ఖడ్గంబున దానిని ఖండింపుము.
ఆ చెట్టు దుష్టసంగమను సేచనమున విరిసి విస్తరిలి మోక్షపథమావ
రించికొనియున్న దద్దానిని జ్ఞానరూప పరశుధారివగు సూత్రధారివి
(వడ్రంగివి) నీచేత ఛేదింపబడుగాక! పరివస్యాపరుండనై గురుండ
వగు నిన్ను శిష్యుండనై భజించెద. సమిధలను దర్భలను ఫలములను
దాపువులను నీరును సంగ్రహించి తెచ్చెద నన్ననుగ్రహింపుము, వినీ
తుండ నిదె వచ్చితినని బకాఖ్యుండు బకవృత్తింగొని వర్తించు
నాయార్జవమ్మున కావర్జితుండై నన్ను స్వీకరించెను. అప్పు డతి
వినయమ్మున నమ్మునిని ముగ్ధాంగనాసంగతు నమితవిశ్వాసము
కలుగునట్లు దినదినము నుపాసించుచు సంతోషపెట్టితిని. అతడును

మనస్కాలబుద్ధి శుభోదర్కమ్ముగాదు. అట్టి నావంటి నీచులచేతనే
లక్ష్మి చంచలయను నపవాదమునకు గురియగుచున్నది. కావున 'మునీంద్రా!
నాయెడ కరుణింపుము. శాపాంత మిప్పుడ చేయుము. దుర్వినీతు
లందును సాధువులు క్షమాశాలురుకదా' ఇట్లు విన్నవింప నమ్ముని
"ఇంద్రద్యుమ్నుండు కీర్తిమాసి మరల దాని నుద్ధరించుతరి నీవాతనికిం
దోడై శాపమోక్షమొందెదవు" అనెను. అది మొదలే నీహిమగిరిపై
కాశ్యపేయుండనయ్యు గొంగనై వసించెద. రాజ్యము చిరాయువు
నాకు పుణ్యపరిపాకంబులమ్మున జాతిస్మరత్వమును గల్గినది. గాలవముని శాప
మ్మున బకత్వమును గల్గెను. నీవడిగిన విదెల్ల దెల్పితి ననియె.

## బిల్వదళ పూజాప్రభావము

—: (అధ్యా. ౮.) ప్రాకారకర్ణుడను నులూకముచరిత్ర :—

నారదుం డర్జునున కిట్లనియె నట్లు నాడీజంఘుని వచనంబు విని
యింద్రద్యుమ్నుడు మార్కండేయునితోఁగూడ మిక్కిలి దుఃఖించెను.
అంత మార్కండేయుండు బకమ్మునితో నిట్లనియె. ఇతడు మరణింప
బూని నాకడకు వచ్చెను. నేను నీదరికి వచ్చితిని. నీపై గంపెడాశ
పెట్టుకొంటిమి కాని మాపని సఫలము కాలేదు. హతాశులై మరలి
పోవు నర్థులను సాధువులు చూడలేరు. అట్లుపేక్షించుటకంటె మర
ణము మేలు. నీవు దీర్ఘాయుష్మంతుడవు నాకాప్తమిత్రుడవని మన
సులో బెట్టుకొనియే యితనికి నేను మాట యిచ్చితిని. ఇతని ప్రయో
జనము తీర్తునని నా జీవితము నొడ్డి ప్రతినచేసితిని. ఇచ్చినమాట
చెల్లించుకొనుటకు హరిశ్చంద్రుడ ట్లంత్యజాతివానికి దాసుడగుట
యేని మంచిది. అసత్యవాదిత్వము నింద్యము. మిత్రస్నేహము
సాప్తపదీనమందురు. మిత్రుడు దుఃఖదశలో నుండగా కనిపించనైన
గనిపించని యాస్నేహమేలాటిస్నేహము! యశశ్శరీరియగు నింద్రద్యు
మ్నునికై నే నిప్పు డగ్నిప్రవేశముచేసెదను. ఇది నిశ్చయము. నా
కనుజ్ఞ యిమ్ము. ఇదే నీతుదిదర్శనము. అని మార్కండేయ మహర్షి

